నవయుగ గ్రంథమాల

పుష్పము 3.

# శాసనతిరస్కారము



తల్లాప్రగడ రామారావుచే

అనువాదితము.

---

నవయుగ గ్రంథమాలవారిచే

ప్రకటితము.



సర్వస్వామ్యసంకలితము

---

౧౯౨౧

# తొలిపలుకు

భారతదేశము సహాయనిరాకరణోద్యమము ప్రారంభించి తొమ్మిదిమాసము లయినది. దేశమందు నలుగడల నుద్యమము బాగుగ వ్యాపించి, బహుకాలమునుండి బానిస నిద్ర పోవుచున్న ప్రజల మేల్కొల్పి స్వరాజ్యాందోళనమునకు ప్రేరేపించెను. ప్రజలు నిశ్చలమనముతో స్వరాజ్య సంపాదనమునకు కృషి సల్పుచున్నారు. నిరంకుశాధికారులోకమూల సంస్కరణము లని వాపోవుచు; నింకొక ప్రక్క రేపో మాపో చచ్చుటకు సంసిద్ధముగ నున్న పత్రికాశాసనము క్రింద అక్రమముగ, అన్యాయముగ దేశీయపత్రికల నిర్బంధించుచు, కల్లుపాటల విషయమున కృషిసల్పు ప్రచారకులతో ననవసరముగ కయ్యమునకు గాలు దువ్వుచు, ప్రజలను నిర్భయముగ తమ మనోభావముల వెలిబుచ్చకుండ నిర్బంధించుచు, మార్లేగారి "ఒకచేతితో సంస్కరణములు, రెండవ చేతితో దండనల"ను కడు హైన్యమగు రాజనీతి నవలంబించి, దండనపద్ధతు లెన్నటికిని జయముగాంచ నేరవను సత్యమును చరిత్ర యనంతముఖముల నుద్ఘోషించుచున్నను, చెవిటివాని కైవడి సరకుగొనకుండిరి. ప్రస్తుతసమయమున దేశీయమహాసభోపసంఘమువారు విదేశవస్త్ర బహిష్కారమును, మద్య

పానని షేధమును సంపూర్ణముగ జయము గాంచునట్లు చేయు టకు నిర్దేశించిరి. త్వరలో యీ విషయములందు మనకు విజయము చేకూరుట నిశ్చయము. దీనితో నిరంకుశాధికారులు మనకు లొంగెద రనుట వట్టికల్ల. నిరంకుశాధికారమును నిర్మూల మొనర్పవలయునన్న దానిపై శాసనతిరస్కార బాణము మనము ప్రయోగింపవలయును.

శాసనతిరస్కార మొక యమోఘమైన మంత్రము. దానిని ఉచ్చరించి కార్యరూపమున మంత్రించిన మనకు జయము గలుగుటయేగాక మనశత్రువులకు కూడ శ్రేయస్సు గల్గును. దీని నెవరిపై నుపయోగించెదరో వారికిని, నుప యోగించినవారికిని లాభము చేకూరును. ఇట్టి పవిత్రమగు పాశుపతాస్త్రమును త్వరలో భారతీయు లుపయోగింపవలసి యున్నది. అందుచే, శాసనతిరస్కార మన నేమిటియో దాని నేల ప్రతిమానవుడును ఆచరింపవలయునో, దాని వలన మనకు గలుగు లాభ మెద్దియో దెల్పుచు సుప్రసిద్ధ వేదాంతులును, అమెరికా దేశీయులగు హెన్రి. డేవిడ్ థోరో గారు వ్రాసిన చిన్నిగ్రంథము ననువాదించి, ఆంధ్రప్రజలకు మా గ్రంథమాల తరఫున తృతీయపుష్పముగ నర్పించు చున్నాము. ఆంధ్రులు సమస్తవిషయములందును ముందంజ వైచుచున్నారు. దేశీయమహాసభాజ్ఞానువర్తులై యసహా యోద్యమ మింతవరకు జయప్రదముగ కొనసాగించిరి. ఇక

ము౦దు శాసనతిరస్కార ధర్మవిషయమున ఆంధ్రులు కడు జాగరూకతతో మెలంగి, అన్యరాష్ట్రీయులకు మార్గదర్శకులై, భారతస్వరాజ్యము సంపాదించి, మానవ కల్యాణమునకు సహాయభూతు లగుదురు గాక యని కోరుచున్నాము.

మా గ్రంథమాలకీ గ్రంథప్రచురణసందర్భమున బ్రహ్మశ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు చేసిన ద్రవ్యసహాయమునకు మేము మా కృతజ్ఞతను వెలిబుచ్చుచున్నాము.

ఆంధ్రులు మా గ్రంథమాలలో చందాదారులుగ జేరి, మా గ్రంథమాల ప్రచురణములకు ప్రోత్సాహ మొసంగెదరు గాక యని కోరుచున్నాము.

సంపాదకుడు.

# శాసన తిరస్కారము.

(౧౮౪౯)

---

ఏ ప్రభుత్వ మత్యంతస్వల్పముగ నధికారము చెలాయించునో యదియే శ్రేష్ఠమైనదను సిద్ధాంతమును నేను హృదయపూర్వకముగ నంగీకరించెదను. అతిత్వరితముగను, సుస్థిరముగ నీ సిద్ధాంతము నాచరణ యందుంచవలయును. నేను నమ్మినంతవర కందులభావ మిది. "అధికారము నేమాత్రమును చెలాయించని ప్రభుత్వమే సర్వోత్తమము." ప్రజలందుల కియ్యకొనినచో, నిదియే వారభిలషించు ప్రభుత్వము. సత్ప్రభుత్వము సాధారణముగ కాలానుగుణ్యము. చాలవరకు ప్రభుత్వములు మామూలుగను, ప్రభుత్వములన్నియు అప్పుడప్పుడును కాలానుగుణ్యముగ ప్రవర్తించుచుండవు.

స్థాయిసైన్యమున కెట్టి ప్రతిహతముల జెప్పెదమో యట్టి ప్రతిహతములనే స్థాయిప్రభుత్వ సందర్భమున గూడ చెప్పెదము. స్థాయిసైన్యము (Standing Army) స్థాయిప్రభుత్వమున కొక యాధారము. ప్రజలు తమ మనోనిశ్చయము నాచరణయోగ్య మగునట్లు చేయుటకు నిర్మించిన ప్రభుత్వముకూడ కార్యభారము వహింపకపూర్వమే దూషింపబడుచుండును. ప్రస్తుతము జరుగుచున్న మెక్సికో యుద్ధమును బరిశీలింపుడు. స్వల్పసంఖ్యాకులు కొందరెట్లు స్థాయిప్రభు

త్వమును బొమ్మవలె నాడించు చున్నారో! ఏలనన ప్రథమమున నిట్టిపద్ధతికి ప్రజ లామోదము చూపియుండెడివారు కారు.

ఈ అమెరికా ప్రభుత్వమున నేమున్నది? ఎంత ప్రాచీనసాంప్రదాయము గల్గియున్నను, ప్రతి క్షణమును తన యాత్మగౌరవమును గోల్పోవుచున్నది. ఒకేవ్యక్తి కుండు ధైర్యము, శక్తి దీనికి లేదు. ఏలనన ఒకవ్యక్తి తననిశ్చితాభిప్రాయము ననుసరించి దీనిని నడిపించగలడు. ప్రజలకు గూడ నిది కొయ్యతో చేయబడిన యొక ఫిరంగివలె గన్పట్టుచున్నది. అంతటితో దీనిగూవశ్యకత యంతరించదు. ఏదియో యొక్క ప్రభుత్వ ముండవలెను; అంతమాత్రమున ప్రభుత్వమును నదొకటి కలదను నభిప్రాయము వ్యాపించియుండును. ప్రభుత్వములు ప్రజలను తమను గూడ తమవశమునం దుంచుకొనినట్లు చూపుచున్నవి. ఇదంతయు స్వలాభమునకు మాత్రమే! అది యోగ్యమైనదియే కావచ్చును. కాని ప్రభుత్వము దానంతటది యెన్నడును సాహసబుద్ధితో నేకార్యమునకు దలపెట్టలేదు. కాని చాకచక్యముతో మాత్ర మిట్టి కర్తవ్యమును త్రోసివేయుచుండును. అది దేశమునకు స్వేచ్ఛనొసంగదు. తగవులను పరిష్కరించదు. విద్యావ్యాపనను గావించదు. ఇండియా రబ్బరువ్యాపారము తప్ప యితర వర్తకమేదియు నిరభ్యంతరముగ సాగియుండలేదు. న్యాయముగ విచారించినచో నిట్టిపనుల కొడిగట్టువారు రైలురోడ్లమీద అనవసరమగు నభ్యంతరముల గల్గించువారితో సమానముగ జేర్చి శిక్షింపవలసి యుండును.

కాని, యేప్రభుత్వము నక్కఱ లేదనువారివలె కాక యొక పామరునివలె నింతకంటె శ్రేష్ఠమైన ప్రభుత్వమును వాంఛించెదను. ప్రతి మనుష్యుడును తన గౌరవమున కే ప్రభుత్వము కావలయునో యాలోచించినచో, నదియే తమకోర్కె సఫల మగుట కొక సోపానము.

పరిపాలనాధికారము ప్రజల హస్తగత మైనప్పుడు, అధిక సంఖ్యాకులను ప్రభుత్వముగా జేయుటకు కారణము వారికిగల దేహబలమే. అంతేగాని వారిమార్గము సరియైనదని గాని లేక స్వల్పసంఖ్యాకులకు న్యాయమైనదిగ గన్పట్టునని కాని కాదు. అధికసంఖ్యాకులచే నడుపబడు ప్రభుత్వ మన్ని విషయములలోను ప్రజాసామాన్య మనుకొనినంతవర కైనను న్యాయమును గలుగ జేయదు. న్యాయాన్యాయములను పరిష్కరించుటయే కాక అంతరాత్మనుకూడ త్రిప్పుచున్న ప్రభుత్వము లేదా ? తాత్కాలికసిద్ధాంతమును (Rule of expediency) వినియోగించి సమస్యల బరిష్కరించుచున్న పాలకులు లేరా ? పౌరులు తమయంతరాత్మను ప్రభుత్వవశము గావింపవలెనా ? అట్లైనచో ప్రతిమానవున కేల యంతరాత్మ యుండవలెను ? ప్రథమమున మనము మానవులమని గుర్తించి తరువాత పౌరులవలె మెలంగవలెను. జన్మహక్కును గౌరవించవలెనుగాని శాసనమును గౌరవించుట యోగ్యమగునది కాదు. నేనేది మంచిదని దలచెదనో దానిని చేయుటకు నేను హక్కును గల్గియుండవలెను. సంఘమున కంతరాత్మ లేదను వాదము సరియైనదియే. కాని అంతరాత్మను గలిగిన మానవ

సభ్యత్వముతో నిండిన సంఘము అంతరాత్మయుత మగు సంఘ మని భావింపవచ్చునా. శాసన మెప్పుడును మానవుల న్యాయదక్షులుగ జేయలేదు. శాసనమును గౌరవించ వలె ననెడి భావముతో సన్మార్గులుకూడ న్యాయవిహీనమగుచర్యలకు దిగవలసివచ్చు చుండెను. తమ యంతరాత్మలకు వ్యతిరేకముగ రణరంగములకేగు సైనికులు, కప్తానులు మున్నగు సైనికోద్యోగులు శాసనముల నక్రమముగ గౌరవించెడివారే. మానవున కుండు సామాన్యబుద్ధియైనను వీరికి లేదు. ప్రతి క్షణమును వీరి హృదయములు కొట్టుకొనుచుండును. తమకు విధింపబడిన కార్యము అక్రమమయినదని వారికి దెలియును. వారు శాంతచిత్తులు. వా రెవరు? మానవులా? లేక అధికారమును వహించియున్నట్టి నిర్దయుని సేవలో నున్నటువంటి యాయుధములా? సముద్ర రేవునకు బోయి ఓడసిపాయిని సందర్శింపుడు. అనేకవిపత్తులకు లోనగునట్లును మరణమునకైనను సంసిద్ధుడగునట్లును అమెరికను ప్రభుత్వముచే సృష్టింపబడినటువంటి మానవుడితడే!

* * * *

ఈవిధముగ ప్రభుత్వమునకు మనుష్యులు కేవలము యంత్రములవలె సేవచేయుదురు. వారే స్థాయిసైనికులు, పోలీసు మున్నగు నధికారులు. చాల విషయములలో స్వేచ్ఛాభిప్రాయమును గాని, నీతియుత మగు బుద్ధినిగాని వెలిబుచ్చుటకు వీలులేదు. కొయ్య, మన్ను, రాయివలె భావించుకొనుచుందురు. కీలుబొమ్మలవలె ననుకూలప్రవర్తకులుగ నుండుటకు మానవులను కొయ్యతోగూడ సృష్టింపవచ్చు

నేమో? అటువంటివారి కేవిధమగు గౌరవము నుండజాలదు. గుడ్డిములు, శునకములు మొదలగు జంతువులవలె సంచరింతురు. ఇటువంటివారు కూడ సామాన్యపౌరులవలె జూడబడుదురు. తక్కినవారు—శాసనసభ్యులు, రాజకీయ వేత్తలు, ప్లీడర్లు, మంత్రులు, ఉద్యోగస్థులు—తమబుద్ధి నుపయోగించి రాజ్యాంగమున కూడిగము చేయుదురు. నీతివిచక్షణను గావింపరు. కావున తెలియక పిశాచమునే భగవంతునిగ బూజించిన బూజింపవచ్చును. మరి కొంతమంది స్వల్ప సంఖ్యాకులు వారి యంతరాత్మప్రకారము—ధీరులు, దేశభక్తిపరాయణులు, సంస్కర్తలు కావచ్చును— ప్రభుత్వ సేవకు గడంగి ప్రభుత్వమును నిరోధింప యత్నించవచ్చును. వీరిని కూడ ప్రభుత్వము వారు శత్రువులుగ బరిగణించుదురు. బుద్ధిమంతు డెప్పుడును ప్రయోజనకారిగ నుండును. అంతే గాని కేవల మితరులచేతిలో పనిముట్టువలె ప్రవర్తింపడు. పర్యవసానమును కాలమునకే వదలివేయును.

*   *   *   *

తన సర్వస్వమును తోడిమానవులకు ధారవోసినవాడు అప్రయోజకుడనియు, స్వార్థపరుడనియు పరిగణింతురు. కాని తనధనములో కొంతభాగమునే పరులకిచ్చిన ప్రయోజనకారిగను, దాననిరతునిగను జూచెదరు.

అమెరికా ప్రభుత్వము నెడ నిట్లు ప్రవర్తించుటమానవ లక్షణమా? ఏమాత్రమును సిగ్గువిడిచి యిట్లాచరింపజాలడు. బానిసల ప్రభుత్వమువంటి దగు నా ప్రభుత్వము నొక రాజకీయ సంస్థగా నంగీకరింపను.

మార్పు సర్వమానవలక్షణము. అనగా ప్రభుత్వము యొక్క నిరంకుశాధికారము మర్బరమై, సహింపజాలని స్థితిలో నున్నప్పుడు రాజభక్తిని నిరాకరించుటకును, ప్రభుత్వము నిరోధించుటకును అధికారమును గలిగియుండుటయే యని దీనిభావము. కాని 1775 సంవత్సరములో సంప్రాప్తమైన తిరుగుబా టిట్టిదనియే నా యభిప్రాయపడుచున్నారు. విదేశసరకులపై సుంకముల విధించుటవలన ప్రభుత్వమునకు గౌరవము పోయినదని యెవరైన దెలియజేసినను నే నంత వ్యాకులత పడవలసినయగత్యము లేదు. అది లేకపోయినను నాకంత చిక్కులేదు. యంత్రము లన్నిటికిని సంఘర్షణ ముం (Friction) డును. చెడుగునకు వ్యతిరేకముగ పోటీకి నిలుచుట కెంతయు నిది యుపయోగకారి కాగలదు. అందువిషయమై గొప్పకలవరము గలుగజేయుట న్యాయము గాదు. దొంగతనమును వృద్ధిపొందినచో నటువంటి యంత్రమును మనము విసర్జింపవలసియుండును. అనగా స్వాతంత్ర్య మనుభవించుచున్నామని విఖ్యాపిగెడు జాతిలో నారవవంతు బానిసలై జీవనము చేయుచుండినను, విదేశసైన్యములచే నకారణముగ పీడింపబడుచున్నను, సైనికశాసనములబారి పడవలసినను సన్మార్గ మెదురుతిరిగి తత్క్షణమే పోరాడుట కది సమయము కాదని నేను తలంచెదను. మనధర్మమును నెరవేర్చుట మనదేశమునికాదు. ముట్టడించినసైన్యము మనదనియే భావించవలెను. "సివిల్ ప్రభుత్వమునకు లోబడియుండవలె ననెడు ధర్మము" (Duty of Submission to Civil Government) అను గ్రంథమును రచించిన నీతిశాస్త్రమునందు మేధావి

యగు పేలీ (Paley) గా రిటువంటి రాజభక్తి తాత్కాలిక మని నిర్ధారణచేసెను. ఇంక నీవిధముగ నాయన వ్రాసియుండెను :—"సంఘసౌఖ్యము వలయునెడల, అనగా ప్రజల కేదుర్ఘటమును లేక స్థాపింపబడిన ప్రభుత్వము (Established Govt.) నిరోధింపబడ నంతవరకును లేక సంపూర్ణముగ మార్పు చేయబడనంతవరకును ఆ ప్రభుత్వశాసనములనే శిరసావహింపవలె నని భగవంతునియొక్క నిశ్చితాభిప్రాయము. ..................ఈసిద్ధాంతము నంగీకరించినచో, నిరోధక పద్ధతులకు దిగుసమయమున విపత్తుయొక్క లక్షణమును దుర్దశయొక్క పరిణామమును యొకవైపున గమనించుచు, మరియొకవైపున దుస్థితిని బాపుట కెట్టివ్యయమును గావింపవలెనో యాలోచింపవలసియుండును." ఈ సందర్భమున నెవరికి వారే తీర్మానించుకొనవలెనని యాయన నుడివియుండెను.

ఏమి సంభవించినను, ప్రజలును వేర్వేరు వ్యక్తులును న్యాయపరిష్కారము గావింపవలసినట్టియు, కాలానుగుణ్యముగ నుండు పద్ధతులు వినియోగింప రానట్టియు విషయములను పేలీగారు గమనించినట్లు లేదు. మునుగుచున్నటువంటి మనుష్యుని హస్తమున నుండు ప్రాణరక్షక మగు వస్తువు నన్యాయముగ దీసికొనినపుడు, నేను మునుగుట తటస్థించినను దాని నాశనికే యియ్యవలసియుండును. పేలీగారి కిది యసాధ్యముగ నున్నది. అటువంటిసమయమున ప్రాణరక్షణకు దలపెట్టు వానికి మరణము సంభవించక తప్పదు. బ్రతుకుట కాస్పదము లేకపోవుట తటస్థించినను వీరు బానిసలను గలిగియుండరాదు. మెక్సికో యుద్ధమును విరమింప వలసియుండును.

కార్యాచరణమున, అన్నిజాతులును పేలీగారితో నేకీభవించును; కాని, మాసాచు సెట్సు (Massachusetts) యీ సందిగ్ధసమయములో నుత్తమమగు కార్యమునకు దలపెట్టుచున్నదని యెవరైనను దలంచుచున్నారా?

* * * *

అనుభవముతో నాలోచించినచో మాసాచుసెట్సులో సంస్కరణములు వలదనువారు దక్షిణవాసు లగు ననేక రాజకీయవేత్తలు గారు. ఇక్కడ నున్నటువంటి వేలకొలది వర్తకులును వ్యవసాయదారులునై యున్నారు. వీరివ్యవసాయము వాణిజ్యము నశించుననుభీతి వీరికిగలదు. వర్తకవాణిజ్యములకంటె జీవకోటి ప్రాధాన్యమని తలంచుటలేదు. ఎన్ని దురవస్థలకు లోనైనను, మెక్సికోకును బానిసలకును న్యాయము పరిష్కరింప యత్నించుటలేదు. నేను దూరమున నున్న శత్రువులతో కయ్యమునకు దిగను. సమీపమున నున్నటువంటివారును, దూరముననున్నవారితోడ్పాటును పొందుచు కాలమును వ్యర్థపుచ్చువారును, నెవ్వారు లేనియెడల దూరమున నున్నవారు సౌఖ్యవంతులై యుందురో అట్టివారితో బోరాడెదను. ప్రజలలో దగినశిక్షణ లేదని చెప్పుట మనకు వాడుకయైనది. అభివృద్ధి నెమ్మదిగ గలుగుచుండును. ఏలనన, అల్పసంఖ్యాకు లధికసంఖ్యాకులకంటె తెలివిగలవారు కారు. వారికంటె నెక్కువయున్నతస్థితిలోను లేరు. మీవలె నధిక సంఖ్యాకులు సద్వర్తనులై యుండవలెననెడి సిద్ధాంత మంత ప్రాముఖ్యము గాదు.

సద్వర్తనము సంపూర్ణముగ నెచ్చటను లేదు. యుద్ధపద్ధతులకును బానిసత్వమునకును నొడంబడనివారు వేనకువేలు గలరు. అభిప్రాయమునందుమాత్రమే వారావిధముగ నున్నారు. కాని వాటినణచివేయుటకు కార్యభారము వహింపరు. వాషింగ్టనును, ఫ్రాంక్లినుసంతతివారమని తలంచుచు, చేతులుముడుచుకొని, యేమి చేయవలెనో తెలియదనుచు, నేమియుచేయక నూరకుందురు. వాణిజ్యస్వాతంత్ర్యమువలెనే ప్రజాస్వాతంత్ర్యమును గూడ నాపుదలజేయుచు, అతి యారాటముతో నప్పటివస్తువుల ధరలను, మెక్సికోనుండివచ్చు వస్తువులధరల జాబితాను (Advices) మాత్రము దెలిసికొనుచుందురు. భోజనానంతరమున వాటిని మరచి నిద్రాపరవశులై యుండినను నుండవచ్చును. సద్వర్తనునకును, దేశభక్తునకును నీకాలమున విలువ యెంత? వారు సంకోచించుచుందురు. విచారించుదురు. అర్జీలను పంపుదురు. కాని శ్రద్ధతో ప్రయోజనకరమగు పనిని దేనిని జేయబూనరు. వోటును మాత్రము వినియోగించి, ముఖము వ్రేలాడవేయుచు, మంచివిషయముల ద్రోసివేయుచుందురు. సద్వర్తను డొకడున్నచో, సద్వర్తనమున కభిలాష జూపువారు తొమ్మిదివందల తొంబదితొమ్మిదిమంది యుందురు. దేవుడు వరమిచ్చినను పూజారి వరమీయడు.

స్వల్పముగ నీతివాసనను గలిగినటువంటి యొక చదరంగపు టాటవలె వోట్ల యెన్నికలు పరిణమించుచున్నవి. న్యాయాన్యాయవిచక్షణ లేక నీతిశాస్త్రముతో నాటలాడుచుందురు. పోటీపందెములు సాధారణముగ వీనిని వెంబడించు

చుండును. ఎన్నికదారుల ప్రవర్తన కేహానియు వాటిల్లదు. నేను న్యాయ మనుకొనునట్లు వోటు నిచ్చుచుందును. న్యాయమే జరిగితీరవలె ననెడి విషయము నాకవసరము లేదు. ఆవిషయము నధికసంఖ్యాకులకు వదలివేయుదును. ఒప్పుదల కాలానుగుణ్యముగనే యుండును. సద్విషయములకు వోటు నిచ్చినంతమాత్రమున వాటికేమియు జేసినవార మగుట లేదు. అటువంటి సంగతిసందర్భము లుండవలె నను నభిప్రాయమును ఉచ్ఛ్వాస నిశ్వాసములతో వెలిబుచ్చినవార మగుదుము. బుద్ధిమంతు డేవిషయమును కాలమునకు వదలి వేయడు. అధికసంఖ్యాకుల యధికారము ద్వారా నెరవేర్చ యత్నింపడు. జనసామాన్యము గావించు పనులలో సద్వర్తనము స్వల్పముగ గాన్పించును. అధికసంఖ్యాకులు బానిసత్వమును బారద్రోలుట కనుమతించుట బానిసత్వమునకు విముఖులై యుండుటవలన కావచ్చును. లేదా వారి యనుమతి ప్రకారము పారద్రోలుటకు బానిసత్వము స్వల్పముగ నైనను నుండవలెను. వారుమాత్ర మపుడు బానిసలగుదురు. ఎవరు తన వోటువలన తాను విముక్తిని బడయునో, యపుడే తన వోటుచే బానిసత్వమును నిర్మూలనము చేయగలవా డగును.

బాల్టిమోరు (Baltimore) నందో లేక మరి యెచ్చటనో, నిత్యము పత్రికాసంపాదకులుగను, రాజకీయ వేత్తలుగను బనిచేయు వారిలోనుండి, యొక్కరిని ప్రత్యేకసభాధ్యక్ష పీఠమున కభ్యర్థునిగ నెన్నుకొనన బోవుచున్నా రని వింటిని. కాని స్వేచ్ఛగా సంచరించు బుద్ధిమంతుడును, గౌరవయుతు డగువానికి వా రెట్టి తీర్మానమునకు వచ్చిన నేమి?

ఎట్లున్నను అతనియొక్క నమ్మకమును జ్ఞానసంపత్తియును మనకు ప్రయోజనకరములుగ నుండజాలవా? స్వేచ్ఛగా నభిప్రాయములను వెలిబుచ్చువారి వోట్లను మనము గమనింపవలదా? ఇట్టిసభల కేగని వ్యక్తు లనేకులు లేరా? గౌరవనీయుడని పిలువబడెడువాడు దేశమంతయు తనకై చింతింపవలసియుండ దేశమునకై తాను చింతించుచుండును. అభ్యర్థులలో నొకరుమాత్రమే లభ్యమైనవాడుగ గన్పట్టును. నాయకత్వము వహించుటకు వాడొకడే యుపయోగించునని వోటువలన నిర్ధారణచేసినవా రగుదురు. నియమములు లేని, కూలి పనివాండ్రుగ నుపయోగింపబడు దేశీయుల వోట్లకంటెగాని విదేశీయుల వోట్లకంటెగాని నీవోట్లధికము గాజాలవు.

ఆహా! నిరుపయోగియగుచు మానవుడనని సంచరించువాని జన్మ యేమిజన్మ! జనాభా లెక్కలు లోపభూయిష్ఠములై యున్నవి. జనసంఖ్య యత్యధికముగ నున్నది. ఈదేశములో వేయి చదరపుమైళ్లలో నెంతమంది మానవులు గలరు? ఎవరును లేరు. మనుష్యులు నివసించుట కమెరికా యేవిధమగు నావకాశమును గల్పింపదా? అమెరికాదేశీయు డొక విచిత్ర రూపము బొందియున్నాడు. జ్ఞానసంపత్తి నశించి స్వశక్తిపై నాధారపడియుండుటకు శక్తివిహీనుడై యున్నాడు. చూచినంతనే పోల్చబడగలిగినట్టు రూపమును పొందియున్నాడు. ప్రపంచమున ప్రవేశించినంతనే బీదల వసతిగృహములు (Alms houses) సరియగు స్థితియందున్నదియు లేనిదియు చూచుటయే పరమావిధిగా గాన్పించుచున్నది. యౌవనత్వము సరిగ దాపరించక పూర్వమే విధవలకును,

తల్లిదండ్రులు లేని పిల్లలకును సహాయము గావించుటకు సిద్ధిని సమకూర్చుటయే కర్తవ్యముగ దలంచుచున్నాను. నా తనకారి యగు మ్యూచుయల్ ఇన్సూరెన్సు కంపెనీవారి తోడ్పాటుతో మాత్రమే నివసింపగలుగుచున్నాడు.

తప్పిద మెంత గొప్పదైనను దానిని తొలగించుటకై తన శక్తిసామర్థ్యముల వినియోగించుటయే మానవుని ధర్మము కానేరదు. ఇతరవిషయము లాతని కనేకము లుండవచ్చును. కాని తన తప్పిదము లేకుండునట్లును, అట్టిలోపములకు తన యనుమతి నియ్యకుండునట్లును జూచుటమాత్రము మానవధర్మము. ఇతర యంశములకు నాకాలమును వినియోగించు సందర్భమున నితరులకు కష్టమును గలుగజేసి కార్యమును కొనసాగించుట నాయుద్దేశ్యము కాదు. ఇతరులకు తమ పనులను కొనసాగించుటకై సౌకర్యములు గలుగునట్లు చూడవలెను. మదీయపురవాసు డొకడు వాక్రుచ్చు నీసంగతి యెంత యసందర్భముగ నున్నదో చూడుడు—"బానిసల తిరుగబాటు నణచుటకును, మెక్సికో రణరంగమున కేగుటకును వారిచే నాజ్ఞాపింపబడ కుతూహలుడనై యున్నాను." ఇంకను వీరు ప్రభుభక్తిపరాయణులై, ధనసహాయము మూలమునను వారికి ప్రత్యామ్నాయసహాయము నొసంగుచున్నారు. యుద్ధమునకు కారణభూతమును, అశాస్త్రీయము నగు ప్రభుత్వమున పని చేయుటకు నిరాకరించిన సైనికుడు, వారిచేతలను, నధికారము నట్లు తాను తిరస్కరించియుండినను, కొనియాడబడుచున్నాడు. అందుచే నేరాజ్యము గాని పాపము చేయుచు తదుపశాంతికై కొందరిసహాయ

మపేక్షించునేకాని, పాపముచేయుట మానదని తేలుచున్నది. సక్రమశాంతిపరిపాలన మను పేరున మన హైన్యమునకు మన మే దాసుల మగుచున్నాము. అంతట నది నీతిబాహ్యమై మనజీవితమున కవసరమగు వస్తువులలో నొకటి యగుచున్నది.

సర్వసాధారణమైన గొప్పదోషములన్నియు స్వలాభా పేక్ష లేని యొకసద్గుణముపై నాధారపడియున్నది. దేశభక్తి యనెడు సద్గుణము తఱచుగా నెట్టినిందకు పాల్పడునో, యట్టి నింద సజ్జనులకందరికి నారోపింపబడుచునే యుండును. ఒక ప్రభుత్వముయొక్క పరిపాలనాపద్ధతుల కసంతృప్తి చెందియు, దానికి సహాయముచేయువా రట్లు హృదయపూర్వకముగ ప్రవర్తించినవా రగుచుండుటచేత, వారు దేశాభివృద్ధిని నిరోధించినవా రగుచున్నారు. అమెరికా యూనియన్‌ను విడదీయు మనియు, వారియధ్యక్షునికోరికలను లక్ష్యపెట్టగూడ దనియు కొందరు ప్రార్థించుచున్నారు. కాని, తమకును, ప్రభుత్వమునకును గల సంబంధమును విడదీసికొని, కోశాగారమునకు తమధనమును చెల్లింప నిరాకరించి వా రేల తమకోరికలను నెరవేర్చుకొనలేరు? తమకును ప్రభుత్వమునకును నెట్టి సంబంధము గలదో, అట్టిదే ప్రభుత్వమునకును యూనియనునకును గలదని వారికి దెలియదా? తాము రాజ్యాధికారము దిరస్కరింపకుండుట కెట్టికారణము లున్నవో, అట్టివే ప్రభుత్వము యూనియన్‌ను తిరస్కరించుటకు లేవా ?

మానవు డేదోయొకయభిప్రాయమును గలిగియుండుటతో తృప్తిచెంది, దానివలన గలుగుసంతోషమనుభవించుచు నెట్లుండగలడు? తాను అన్యాయస్థితిగ నున్నానని యభిప్రాయ

పడిన సంతోషమేమైనగలదా? నీయిరుగుపొరుగువారు నిన్ను
మోసపుచ్చి, నీవద్ద నొకదమ్మిడీనైనను సంగ్రహించినపుడు,
మోసము గుర్తెరింగి, నీవు నీకు రావలసినదాని నిచ్చివేయు
మని ప్రార్థించుటతో తృప్తిచెందనేరవు. కాని నీసొమ్మంతయు
నీకు చేరువరకు, క్రమమైన చర్య జరపి, యికముందెప్పుడట్టి
మోసము జరుగకుండునటుల జేసికొనెదవు. ఒకనిశ్చితాభిప్రా
యమున కనుగుణముగ బ్రవర్తించుటచేత వస్తుసాంప్రదా
యములు మార్పుదల చెందుచున్నవి. అట్టిప్రవర్తన యొక
యసాధారణమగు తిరుగబాటును గలుగజేయును. రాజ్యము
లందును, మతములందును, కుటుంబములందునే గాక, ఒక
వ్యక్తియందు పిశాచభావములను దైవికోద్రేకములనుండి విడ
దీసి, నూతనాంతర్భాగములను సృష్టించుచున్నది.

అక్రమములగు శాసనములు కలవు. మనము వానికి
లోబడవలెను. వాటికి లోబడియుండి వాటిని మార్పుదల
చేయుటకు బ్రయత్నింపవలయునా, లేక తక్షణమే వాటిని
తిరస్కరింపవలెనా? ఈ ప్రస్తుత ప్రభుత్వమువంటి ప్రభుత్వ
ములో జనులు సామాన్యముగ, నధికసంఖ్యాకు లట్టి మార్పు
దల కంగీకరించువరకు నూరకుండవలసి యుందురు. అధిక
సంఖ్యాకులు తమకు వ్యతిరేకముగ నున్నచో, పుండుకంటె
మందు మిక్కిలి బాధకలుగజేయు నని వారియభిప్రాయము.
అట్లుండుట ప్రభుత్వముయొక్క తప్పిదమే! అవసరమును
గుర్తెరింగి, సంస్కరణములకు దారిచేయుట కేల నట్టిప్రభుత్వ
ము సిద్ధపడదు? దానికి హాని సంభవింపకపూర్వమే యది యేల
ఘోష పెట్టవలె? జనులు బహుజాగరూకతతో దానిలోప

ములు నెరింగి వానిని నిరూపించునట్లుల అది ప్రోత్సహించదు? అది క్రీస్తును శిలువపై నుంచి శిక్షించినది. కొపర్నికస్, లూథర్, సాలమన్ అనువారలను దేశమునుండి వెడలగొట్టినది. వాషింగ్టను, ఫ్రాంక్లిన్ అనువారలను అరాజకులుగ నిర్ణయించినట్టి దీ ప్రభుత్వములే గదా!

ఆచరణ రూపమున బహిరంగముగ తన యధికారమును తిరస్కరించుట యనునొక విషయమును మాత్రమే ప్రభుత్వము సరకుచేయని తప్పిదమని తోచుచున్నది. లేనియెడల దానికి సవ్యమగు శిక్ష నెందులకు విధించియుండదు? ఏమాత్రపుటాస్తియు గలిగియుండనివా రేమాత్రపు స్వల్పధనమునైనను చేకూర్చుటకు నిరాకరించినపుడు ప్రభుత్వము వారిని తన కిష్టమువచ్చినంతకాలము చెఱసాలయం దుంచుచున్నది. కాని ప్రభుత్వధనము నేమాత్ర మెక్కువగ నపహరించినవానినైన విడుదలచేయుచున్నది.

అధర్మము ప్రభుత్వవిధానమం దొకయంగ మగునెడల దానినటు త్రోసివేయుడు. ప్రభుత్వవిధానము తప్పక త్రుప్పుపట్టగలదు. అధర్మమునకు ప్రధానస్థాన ముండునెడల బహుశా పుండుకంటె మం దెక్కువ బాధకర మగునేమో విచారాలోచింపవలసియున్నది. ఇతరులయెడ నధర్మముగ ప్రవర్తింపవలసినదిగ నిన్ను గోరునట్టిస్వభావమునం దుండిన, శాసనమును తిరస్కరింపమనియే నేను చెప్పుచున్నాను. అట్టివిధానము నాపుదలచేయుటకు నీజీవితమునంతను ధారవోయుము. నేను ఖండించునట్టి అక్రమమందు నేను పాల్గొనకుండ చూచుటయే నాధర్మము.

ఇట్టి దుర్దశల బాపుటకు ప్రభుత్వమువారి పద్ధతుల నవలంబించెదమన్నను నా కట్టిపద్ధతు లేమియు గోచరమగుట లేదు. వాటికి చాలకాలము పట్టును. ఈ లోపున నొక పురుషాంతరము గడచును. నా కనేకపనులు గలవు. నివాసయోగ్యమగునట్లీ ప్రపంచమును మార్చుట కుద్యమింపలేను. మంచికైనను చెడుగుకైనను, ఇచ్చట నివసించుటకు జన్మించితిని. ప్రతివ్యక్తియు ప్రతి పనిని చేయనక్కరలేదు. కొంతమాత్రమే చేయవలసియుండును. అంతయును చేయలేదు గనుక కొంతయైన చేయగూడ దనరాదు.

గవర్నరుగాని, శాసనసభవారు గాని నాకు అర్జీలను బంపరు. వారికి విన్నపముల బంపవలసిన యగత్యము నాకును లేదు. వారు నా మొరాలకించనిచో నే నేమి చేయవలెను? ఈ విషమస్థితియందు ప్రభుత్వము నా కేమార్గము జూపియుండ లేదు. దానియొక్క విధానమే లోపభూయిష్ఠమై యున్నది. ఇది కఠినముగను, వెళుసుగను గన్పట్టవచ్చును. మార్పెప్పుడును సౌఖ్యదాయకమే! జననమరణములు శరీరము నెట్లు మార్చివేయునో యట్టి మార్పె యిచ్చట కూడ సంభవించును.

బానిసవర్తకమును రూపుమాపదలంచువా రందరు వెంటనే మాసాచుసెట్సు ప్రభుత్వమునకు తామొసంగు తోడ్పాటును నిరాకరింపవలెనని చెప్పుటకు వెనుదీయను. ధర్మవ్యాపనకు గడంగుటకు మున్ను తా మధికసంఖ్యాకు లగువరకు వేచియుండరాదు. వారి పక్షమున దేవు డున్న చాలును. ఇంకెవరికొరకును నిరీక్షింప నక్కరలేదు. ఇంతే గాక, యెవడు తన యిరుగుపొరుగు వారికంటె నెక్కువగ

ధర్మప్రవర్తనకు గడంగునో యాతడే యధికుడగుచున్నాడు.

ప్రతివత్సరమును పన్నులు వసూలుచేయు నధికారి నన్ను సమీపించినపుడు మాత్రము అమెరికా ప్రభుత్వమును లేక దాని ప్రాతినిధ్యము వహించు స్టేటుప్రభుత్వమును ముఖాముఖిని దర్శించుచున్నాడను. నే నున్న పరిస్థితులవంటి పరిస్థితులలో చిక్కుకొనియున్నవాని కిది యొక్కటే మార్గము. నా యధికార మంగీకరింపు మని స్పష్టముగా నది చెప్పును. ఇప్పుడున్న స్థితిగతులలో, నీ కున్న స్వల్పమాత్రపు సంతృప్తిని ప్రేమను వెలిబుచ్చుచు ప్రభుత్వము నంగీకరింపకపోవుటయే యత్యంత సులభమైనట్టియు, ఫలవంతమగునట్టియు, గత్యంతరము లేనట్టిదియు నగు మార్గమగుచున్నది. పన్నులు వసూలుచేయువాడగు నా సమీపస్థునితోడనే నా కెక్కువపని యుండును. ప్రభుత్వమునకు సేవ జేయుటకు తనంతట తా నంగీకరించినాడు. అతని గౌరవమునకు పాత్రుడను సమీపస్థుడను నగు నేను సుహృదయముతో సంచరించెడి సమీపస్థుడనో లేక శాంతిభంగమును గలుగజేసెడి పిచ్చివాడనో తెలిసికొని యీ యాటంకము నింతకంటె తీవ్రమును మోటగు నాలోచనలతోను మాటలతోను నెదుర్కొనుటకు శక్తివంతు డేమో నిర్ధారణ చేయగలిగినంతవరకు తా నేమో ప్రభుత్వసేవకుడుగను నొక వ్యక్తిగను తా నాచరించుకార్యము లేవియో యెట్లెరుంగగలడు ?

బానిసల పట్టుకొనుట మాని, యిటువంటితోడ్పాటు నిరాకరించి కారాగృహవాసము చేయుటకైనను సమ్మతించి

నట్టి వా రొక వేయిమంది — ఒక వంద లేక పదిమంది యైన చాలును. — వేయేల! ఒక్క మర్యాదస్థు డైనను సరియే — మాత్రముండిన చాలును. అప్పుడే అమెరికాలో బానిసత్వము నిర్మూల మైన దగును. ప్రారంభమున నెంత స్వల్పముగ గన్పించినను సరియే; ఒక పర్యాయము బాగుగ పనిచేసిన సర్వకాలమునకు సాంతముగ ముగించినట్లే యెంచవచ్చును. దానివిషయమై మాట్లాడుటయందే యెక్కువయభీష్టమును గనబఱచుచున్నాము. అదియే మన కర్తవ్య మని తెల్పు చున్నాము.

సంస్కరణలకొఱకు పోరాడు వార్తాపత్రిక లనేక ములు గలవు. కాని అట్టిసేవకు గడంగు నొక వ్యక్తియైన గానరాదు. శాసనసభామందిరములో నిత్యము మానవ హక్కుల నిర్ధారణ గావించుటయందు కాలము వ్యర్థపఱచు స్టేటుయొక్క రాయబారి కరోలీనా చెఱసాలల నుంచబడు నని బెదరించుటకంటె మాసాచుసెట్సులోని కారాగారము నందు బంధించిన, తోడిదేశమున బానిసత్వమును బెంపొం దింప మాసాచుసెట్సు ప్రభుత్వము దలపెట్టినను శాసనసభ వారు రాబోవు సమావేశమున నీ యంశమును త్రోసివేయ జాలరు.

అక్రమముగ నెవరినైన గారాగృహవాసులుగ జేయు ప్రభుత్వములో సద్వర్తనులకు చెఱసాలలే నిజస్థానములై యున్నవి. నియమములు లేక తనను తానే బంధీకృతునిగ జేసికొనునట్లే స్వాతంత్ర్యవాయువులను పీల్చువారికి మాసాచు సెట్సు చూపునట్టి స్థలము కారాగృహమే. పారిపోయిన

బానిసలు మెక్సికో ఖైదీలు, తమ దేశీయుల కష్టముల జెప్పుకొనుటకు యిండియనులును వచ్చు స్థల మిదియే. ప్రభుత్వము తనకు వ్యతిరేకముగ నున్న వారి నుంచుటకు గౌరవయుత మైనట్టియు, స్వతంత్ర మైనట్టియు, ప్రత్యేకస్థల మిదియే. బానిసరాజ్యమున స్వేచ్ఛాపరు డగు మానవుఁడు నివసింపదగినగృహ మిదియే.

అక్కడ తమ పలుకుబడి నశించు ననియు, తమ యఱపులవలన ప్రభుత్వమునకు చలనము గలుగునని తలచువారును, నచ్చట శత్రువులుగ నుండ లేమని తలచువారును, తప్పిదముకంటె సత్యమెంతబలవత్తరమైనదియు నధర్మమువలన బాధనొందినవారు అధర్మములపై నెంత సాహసముతోను సామర్థ్యముతోను కత్తిగట్టుచున్నదియు నెఱుంగరు.

వోటుమూలమున మీ సమ్మతిని దెల్పుడు. వోటనగా కేవలము కాగితపు ముక్కగాదు. మీయొక్క పలుకుబడి నంతను వెలిబుచ్చు హక్కని తలంపవలయును. అధిక సంఖ్యాకుల మాటలు ప్రతిఘటింపని అల్పసంఖ్యాకులు పలుకుబడి లేక నిరాధారులయి యుందురు. కాని అల్పసంఖ్యాకులు పట్టుదలతో కృషి సల్పిన వారిని నిరోధించుట దుస్తరము.

సన్మార్గులను చెఱయం దుంచుటకు ప్రభుత్వ మంగీకరించునో లేక బానిసత్వమును రూపుమాపి యుద్ధపద్ధతులను విసర్జించుట కియ్యకొనునో నిర్ణయించుట సులభము. ఈ సంవత్సరము వేయిమంది పన్నుల నొసంగుటకు తిరస్కరించుట, ప్రభుత్వమునకు ధనము నొసంగి దౌర్జన్యయుతమగు

పద్ధతులకు దింపి యమాయకులకు గూడ ప్రాణహాని తటస్థించునట్లు చేయుటవలె ఘోరపద్ధతి కానేరదు. శాంతియుతమగు తిరుగబాటన్న నిదియే! పన్నులు వసూలుచేయు యుద్యోగిగాని లేక ప్రభుత్వపు టుద్యోగి కాని యెవరైనను వచ్చి "నేనేమి చేయవలె"నని యడుగుచో "నీ వేమైనను చేయుదలంచుచో నీ యుద్యోగమునకు రాజీనామా నొసంగుటకంటె గత్యంతరము లే"దని చెప్పెదను. పౌరులు తమ రాజభక్తిని విడనాడినపుడు, యుద్యోగస్థులు తమ పదవులకు రాజీనామాల నొసంగునపుడు, విప్లవము సంపూర్ణమగును.

విప్లవసంపూర్ణసమయమున రక్తపాతము సంభవించుననుకొనుడు. అంతరాత్మకు హాని సంభవించినపు డొకవిధమగు రక్తము ప్రవహించుట లేదా? ఇట్టి గాయము ద్వారా మానవత్వము నశించి నిత్యము మరణ మొందుచున్నట్లు గన్పట్టుచున్నారు. రక్తప్రవాహము నా కన్నుల యెదుట పొడగట్టుచున్నది.

నేరస్థుని యాస్తిని జప్తిచేయుటకంటె యట్టి వాని కారాగారవిషయమై యెక్కువగ నాలోచించుచున్నాను. ఈ రెండు నొకే ఫలము గల్గియున్నను, నిర్మలహృదయముతో హక్కులకొరకు పోరాడుచు ప్రభుత్వమునకు భయంకరముగ గాన్పించువారు సాధారణముగ ద్రవ్యవంతులగుటకు యత్నింపరు. అటువంటివారికి ప్రభుత్వము గావించు సహాయమతిస్వల్పము. ప్రత్యేకముగ కష్టపడి ద్రవ్యము చేకూర్చువారి కేమాత్రపు స్వల్పపు పన్నైనను దుర్భరముగనుండును.

ఏమాత్రము ధనము వినియోగింపక జీవితము గడపు వారియొద్దనుండిగూడ ధనమును కోరుటకు ప్రభుత్వమువారు వెనుకాడుదురు. కాని ధనవంతుడు తనను ధనవంతునిగా జేసిన సంస్థపై మిగుల పక్షపాతాభిమానమును వహించినవాడై యుండును. ధనము వృద్ధిచెందినకొలదియు సుశీలము క్షీణించుచుండును. ఏలనన ధనము మానవునియొక్క భౌతిక కోరికల సఫలపరచును. ధనము వార్జించుటంత గొప్పపని గాదు. హీనస్థితిలో నున్నప్పుడు తన్నుదుర్కొనుప్రశ్న లనేకములు గలవు. అవి ద్రవ్యవంతునికి స్ఫురింపనే స్ఫురింపవు. ధనము నెట్లు ఖర్చుపెట్టుటను నొక్కప్రశ్నయే ధనికునకు స్ఫురించును. ఇవ్విధమున నతడు సద్వర్తనము లేనివాడగును. కోరికకు సఫలసాధనము లెక్కువైనకొలదియు సులభజీవనము చేయు నదృష్టము తగ్గిపోవుచున్నది.

భాగ్యవంతుడయినప్పుడు తన యభివృద్ధికై మానవుడు చేయదగినదేమనిన బీదదశయందున్నప్పుడు తా నాదర్శములుగ నేర్పరచుకొనినవాటిని ఆచరణలో బెట్టవలెను. క్రీస్తు హీరోడియనులకు వారిస్థితినిబట్టి తగు ప్రత్యుత్తర మొసంగెను. "మీరు చెల్లింపవలసిన కప్పుధనము (tribute-money) నాకు జూపుడ"ని యడిగెను. ఒకడు జేబులోనుండి యొక నాణెమును దీసియిచ్చెను. "సీజరు ప్రతిమ గల్గి, అతడు చెలామణిచేయించుచున్న నాణెమును మీ రుపయోగించు నెడల (అనగా మీరు ప్రభుత్వారాధకులై సీజరుప్రభుత్వములోని సౌఖ్యముల నన్నిటిని అనుభవించుచున్నయెడల అతడడిగినపుడు దానిలోనుండి కొంత తిరిగియిచ్చివేయుడు. సీజరు

సొత్తును సీజరుకును, దేవునివస్తువును దేవునకును సమర్పింపు డని క్రీస్తుజవాబొసంగెను. ఇది వారికేమియు రుచింపలేదు. ఏలనన వారికి తెలిసికొనవలెనను నభిలాష లేదు. స్వాతంత్ర్య మనుభవించుచున్న నా సమీపవస్థులతో నెవరితోనైన మాట్లాడుచున్నపుడు నే నొక్క విషయమును గమనించుచున్నాను. వారు దేశశాంతి యెంతయవసర మనినను, ప్రస్తుత సమస్యాప్రాముఖ్యమునుగూర్చి యెంతప్రసంగించినను,ప్రస్తుత ప్రభుత్వమొసంగు రక్షణమును ద్రోసివేయజాలక, ప్రభుమును ధిక్కరించుటచేత తమయాస్తికిని కుటుంబమునకును గల్గువిపత్తులగురించి యోచించుచుందురు. నామట్టుకు నేనెప్పుడును ప్రభుత్వముచే రక్షింపబడుటకు కోరను. కాని పన్నుల జాబితా నొసంగినపుడు నేను దానిని తృణీకరించిన నాయాస్తి నాక్రమించి, ధ్వంస మొనర్చి, నన్ను నాబిడ్డల నష్టకష్టముల పాల్సేయుదురు. అందుచే బహువిషయములందు మనుష్యుడు గౌరవముగను, సౌఖ్యసంపత్తితోను జీవించుట దుస్సాధ్యము. ధనమును కూడబెట్టి యీ కష్టమును పడనక్కరలేదు. లక్ష్మి చంచలస్వభావ. ఆమె యెల్లపుడు నిన్ను వరింపదు. నీవు కొంతస్థలమును కవులుకు దీసికొని కొద్దిపంట పండించుకొని వెంటనే దానిని తినివేయువలయును. నీవు స్వయంజీవన మొనర్పవలయును. నీకు స్వయంసహాయ మత్యవసరము. విశేషవిషయములందు జోక్యము గల్గజేసికొనక యెప్పటికప్పుడు ధర్మయుద్ధమునకు సంసిద్ధుడవై యుండవలెను.

తుర్కీ ప్రభుత్వమునకు సర్వవిధముల లోబడియుండిన యెడల త్వరలో తుర్కీలో ధనవంతుడు గావచ్చును. హేతు

నియమముల ననుసరించిచూచిన ప్రభుత్వపాలనమందు బీదతన ము విస్తరిల్లిన నిందాపాత్రము, శోచనీయము. హేతునియమ ముల ప్రకారము ప్రభుత్వము పాలించినచో ధనమును, గౌర వపదవులును ఖండనీయములు, నిందాపాత్రము” లని చీనా దేశపు వేదాంతియగు కన్ ఫూషస్ (Confucius) చెప్పెను. ఇది నిజముగాదు. నేనుండు విదేశపట్టణమున స్వేచ్ఛారహితు డనైయుండి మాసాచుసెట్సు ప్రభుత్వముయొక్క రక్షణ నపేక్షించువరకును, లేక, శాంతిపద్ధతులమూలమున స్వదేశ మందు జమీందారీ యొకటి సంపాదింపవలెనని సంకల్పించు వరకుగాని మాసాచుసెట్సు ప్రభుత్వమును నిరోధించి, దానికి నాసొత్తుపై గలయధికారమును దొలగింపగలను. ప్రభుత్వమున విధేయుడనైయుండి ప్రతిఫలము ననుభవించునప్పటికంటె ప్రభుత్వమునకు విధేయుడనై మెలంగిన నెక్కువ నష్టము సంప్రాప్తించును. అట్లు మెలంగిన నేను నిష్ప్రయోజకుడ నగుదును.

కొన్ని సంవత్సరముల క్రిందట చర్చివారి తరఫున ప్రభుత్వమువారు నన్నెదుర్కొని యొక మతప్రచారకుని జీతములో కొంతభాగమిమ్మని యాజ్ఞాపించిరి. ఆప్రచారకుని యుపన్యాసముల నాతండ్రి వినెడువాడు కాని నే నెపుడును వినియుండలేదు. “ధన మొసంగుము లేదా కారాగృహవాస మొనర్పు”మని యాజ్ఞాపింపబడితిని. నేను ధనమిచ్చుట కొప్పు కొనలేదు. కాని దురదృష్టవశమున దాని నొసంగుట సమంజ సమని తలచి మరియొకరు చెల్లించియుండిరి. ప్రచారకులకు సహాయముచేయుటకై యుపాధ్యాయులేల పన్నులనొసంగ

వలెను? ఉపాధ్యాయులసహాయార్థము మతప్రచారకులపై
పన్నులనేల విధింపరాదు? ప్రభుత్వమువారిచే నియమింప
బడినయుపాధ్యాయుడను గాను. నాకు ప్రజలవిరాళముల
మూలమున జీవనోపాధిగలుగుచున్నది. విద్యావిషయికసంఘ
ములు బిల్లుల తయారుజేసి ప్రభుత్వమువారివల్లను చర్చివారివ
లనను యేల ధనమునుపొందరాదో గోచరమగుట లేదు. వారు
నన్ను కోరగా నే నీక్రిందివాక్యముల నొసంగితిని - "హెన్రీ
థోరో యని పిలువబడెడు నేను, నేను చేరియుండనట్టి
వంటి యేసంఘమునందును సభ్యుడుగ బరిగణింపబడుట
కిష్టపడనని యిందుమూలమున నెల్లరకును దెలియపర్చు
చున్నాను." ఈ విధముగ లిఖించి పురమునందుండు
గుమాస్తాకిచ్చితిని. అది యాతనియొద్దనే యున్నది. నేనామత
ప్రచారక సంఘమందు సభ్యునిగానుండుట కంగీకరింపలేదని
ప్రభుత్వమువారపుడు గ్రహించి నన్నప్పటినుండి యెన్న
డును పన్ను నడిగియుండలేదు. అప్పటికిని తమ సిద్ధాంత
ములను మార్పదలచుకొనలేదని చెప్పుచుండెడివారు. సంఘ
ముల పేర్లు నాకు దెలియవు. కాని వానిజాబితా నాకు
దొరకిన నేను చేరియుండని ప్రతి సంఘమునందు గల నా
సభ్యత్వమునకు రాజీనామా నొసంగియుండెడి వాడను.
సంఘముల పూర్తిజాబితా యెచ్చట దొరకునో తెలియదు.

నే నారు సంవత్సరములు పోల్‌టాక్సు (Poll-Tax)
నొసంగలేదు. ఇందు కొకప్పు డొకరాత్రి ఖైదిగా నుంచ
బడితిని. రెండుమూడడుగులు మందము గల రాతిగోడలును,
ఒక యడుగుమందము గల యినుపతలుపును, యినుప కట

కటాలును గురించి యాలోచించునపుడు నేను కేవలము మాంసరక్తములతో చేయబడిన వానిగ నెంచి బంధీకృతునిగ జేసిన యీ ప్రభుత్వముయొక్క తెలివితక్కువతనము నాకు స్ఫురింపక పోవలేదు. నేను తన కుపయుక్తుడుగనుండు నట్లు చేయుట కింతకంటె మంచిపద్ధతి లేదని యెంచి యే మార్గముననైనను నా సేవను వినియోగింప ననతే యోచింపకుండుటకు నే నెంతయు నాశ్చర్యపడితిని. నాకును పురవాసులకును మధ్య నొకరాతిగోడ యున్నచో నావలె వారు స్వేచ్ఛ యనుభవింపవలె నన్నచో వగుల గొట్టి దాటుట కొక గోడ అడ్డము కలదని నేను గ్రహింప గలిగితిని. నే నెపుడును బంధింపబడినట్లు భావించుకొనలేదు. గోడలకొరకు ఇసుకను సున్నమును నధికముగా వెచ్చించి నటుల నాకు దోచెను. పట్టణములోని వారందరిలోను పన్ను చెల్లించనివాడునే నొక్కడనే యని నాకు తోచెను. నన్నేమిచేయవలెనో ప్రభుత్వమువారికి తెలియునే తెలియదు. వారు కడుహీనముగ ప్రవర్తించిమున్నారు. నన్ను భయపె ట్టునపుడైనను, ఆదరించునపుడైనను వారికి దోషము తప్ప వేరుగాన్పించదు. ఈచెరసాలగోడను దాటి నావలపడి స్వా తంత్ర్య మనుభవించుటయే నాయుద్దేశ్య మని వా రభిప్రాయ పడిరి. నిరాటంకముగను విచ్చలవిడిగను సంచరించు నాయా లోచనలలో నిమగ్నుడనైన నాకు, కడుప్రయాసతో ప్రభు త్వమువారు తలుపులకు తాళములువేయుట చూడ నెంతయూ నవ్వుగల్గినది. నిజముగా నాయాలోచనలేగదా ప్రమాదకర ములు. ప్రభుత్వమువారు నాచెంతకురాలేరు. కాని నాశరీర

మును శిక్షించుచున్నారు. ఇట్లే బాలురను తాము కోపించిన యెవ్వరైన తమకందనిచో, యాతనివెంట నుండు కుక్కను దిట్టుచుందురు. ప్రభుత్వమువారు తెలివితక్కువవారును, అమూల్యమగునగల ధరించి యొంటరిగనున్న స్త్రీవలె భయభ్రాంతులగుచు శత్రుమిత్రవిచక్షణ లేక యున్నారని గ్రహించితిని. అంతట వారియెడ నాకదివరకున్న గౌరవముకూడ నశించినది.

ఈవిధముగ ప్రభుత్వము మానవుని భావోద్దేశముల నెదుర్కొనలేక వానిశరీరమునుమాత్రము నిర్బంధించుచున్నది. ప్రభుత్వమునకు తెలివిలేదు, గౌరవములేదు. నేనొకరిచే నిర్బంధపడుటకు జన్మించలేదు. నా యాచారనియమముల ననుసరించి నేను సంచరించెదను. ఎవరు బలవంతులో చూచెదముగాక. ప్రజాసామాన్యమున కెంతశక్తి యుండును? నాకంటె నధికముగ నెవ్వరు ధర్మారాధనము గావించెదరో వారే నాకంటె బలవంతులును, నన్ను నిర్బంధింపగల శక్తి గలవారునై యున్నారు. నిర్బంధించియైనను నన్ను వారి యొక్కస్థితికి తీసికొనిరాగలరు. ప్రజాసామాన్య మొకవ్యక్తి జీవితవిధానము నిదమిత్థమని నిర్ణయింపగ నెన్నడును విని యుండలేదు. అట్టి ప్రజాసామాన్యముచే నిర్ణీతమగు జీవితమొక బ్రతుకా?

"నీధన మొసంగుము లేదా నీప్రాణముల దీసెదను" అని చెప్పెడు ప్రభుత్వమునకు నేనేల ధన మొసంగవలెను? ఆప్రభుత్వము కడుకష్టకాలమందుండవచ్చును. దాని కేమి చేయుటకు దెలియకపోవచ్చును. కాని నేనేమియు సహాయము

దానికి చేయజాలను. అది తనకుతానే సహాయపడవలయును. నామార్గ మవలంబింపుము. ఏసంఘయంత్రాభివృద్ధికిని నేను బాధ్యుడను కాజాలను. నేను యింజనీరుయొక్క కుమారుడను గాను.

రెండు విత్తనముల నొకస్థలమందు నాటిన వాని స్వధర్మముల నవి యనుష్ఠించును గాని యొకదాని యభివృద్ధికి రెండవది మార్గమును వదలజాలదు. అంతట నవి పెరిగి పెద్దవైన పిమ్మట నొకదాని నింకొకటి నాశనము జేసిన చేయవచ్చును. తన స్వధర్మ మతిక్రమించిన మరణము సంప్రాప్తమగును. మానవుని జీవితము కూడ నట్లే పరిణమించును.

రోడ్డుపన్ను (High-way tax) చెల్లించుట కెన్నడును వెనుదీయలేదు. ఏలనన ప్రభుత్వము వారికి నే నెంత చెడ్డవానిగా కనుబడవలె నని యత్నింతునో నా పౌరసోదరుల కంత మంచివానిగా నుండగోరుదును. పాఠశాలలకు సహాయము చేయు విషయమున నాతోడి దేశీయులలో నాకు సాధ్యమయినంతవరకు విద్యావ్యాపన కావించుచున్నాను. పన్నుల జాబితాలో నేయొక్క విషయమునకు గాని మిషపైని పన్ను నొసంగుటకు నిరాకరించుట లేదు. ప్రభుత్వమునకు లోబడియుండుటకు నా కిష్టములేనందున నిట్లు గావించితిని. ప్రభుత్వమునుండి విడిపోయి దూరముగ నుండనెంచితిని. దానిసత్వము పెంపొందింప నంతవరకును, రక్తపాత మగు యుద్ధమునకు కారణభూతము కానంతవరకును ధన మెట్లు వెచ్చింపబడినను నేను లెక్కజేయను. నాణెముల తప్పేమియు

లేదు. కాని ప్రభుభక్తివలన గలుగు ఫలితములను వెల్లడి చేయ నెంచితిని.

ఎట్టి లాభమును ప్రభుత్వమునుండి పొందగలనో దానిని పొందుచు అవసరమయిన ప్రభుత్వమును నుపయోగించుకొనుచు, నేను ప్రభుత్వముతో యుద్ధమునకు గడంగుచున్నాను. ఇట్టి పరిస్థితులం దిటువంటి విషయము సాధారణముగ తటస్థించును.

ప్రభుత్వముపై సానుభూతి గలిగి నే నీయవలసిన పన్ను నంగీకరిచ్చిన వారు తాము న్యాయముగ నేమి చేయుచున్నారో దానినే మరల గావించుచున్నారు. ప్రభుత్వమునకు వలయు దానికంటె నధికముగ నిచ్చి వారు అధర్మము వృద్ధిజేయుచున్నారే గాని వేఱు గాదు. అట్లుగాక పన్ను చెల్లింపవలసిన వానిపై గల ప్రేమచే వాని పొత్తుచు నిలుపుట కట్లు గావించినవారు తమ ఆంతరంగిక భావములతో దేశక్షేమమున కెట్టి యభ్యంతరములు గలుగ జేయుచున్నదియు గ్రహింపజాలకున్నారు.

ఇదియే మదీయప్రస్తుతస్థితి. ఒక వ్యక్తి తాను చేయు పనులు మూర్ఖమనియు అన్యవ్యక్తుల యభిప్రాయములకు భిన్నముగ నుండు ననియు నెంచి అత్యంతజాగరూకతతో మెలంగుట కష్టము. సమయముబట్టి తనకు దోచినవిధమున తానే దైవకార్యము గావించుట ధర్మము.

"ఏమి! ఈ ప్రజల యభిప్రాయములు మంచివే; వా రజ్ఞానులు. ఎట్లు ప్రవర్తింపవలసినదియు తెలిసినవారు బాగుపడుదురు. వారి యిష్టమునకు వ్యతిరేకముగ గన్పడునట్లు నీవేల ప్రవర్తింపవలయున"ని నెకొక్కప్పుడు దలంచు

చుందును. కాని మరల నీవిధముగ నాలోచించెదను. "వారు చేయునట్లు నే నేల చేయవలయును ? వారిని ప్రత్యేక బాధలకు నే నేల లోనగునట్లు చేయవలయునో కారణ మగ్రాహ్యము" అనేకలక్షలమంది శాంతముగను, స్వలాభాపేక్ష లేకుండను శాసించినయాజ్ఞలను మార్పుదల చేయించుటకు నీకు గత్యంతర మేమియు లేనప్పుడు, నీ విట్టి యనంతమగు పశుశక్తి నెట్లెదుర్కొన జూచెదవని అప్పుడప్పుడు తర్కించుచుందును. నీవు మూర్ఖముగ శీతలమును, క్షుద్బాధను, వాయువును, సముద్రతరంగములను నెదుర్కొనవు. ఇటువంటి అవసరవిషయము లనేకములకు తల యొగ్గుచుందువు. నీశిరము నగ్నిహోత్రమునం దుంచవు. కాని యిది సంపూర్ణమగు పశుశక్తికాదనియు, కొంతభాగము మనుష్యశక్తి గలదనియు, అనేకలక్షలకొలది గల జనముతో నాకు సంబంధము గలదనియు నే నెంత నమ్మెదనో, య తవరకును జనసామాన్యము దేవునకును, తనయంతరాత్మకును వెరచుట యసంభవము కాదని గ్రహింపగలము. కాని, మనఃపూర్వకముగ నా శిరమును అగ్నిలో నుంచినయెడల అగ్నిదేవునికిని, భగవంతునికిని మొఱలిడిన లాభము లేదు. అప్పుడు నన్ను నేనే నిందించుకొనవలయును. కాని ప్రస్తుతము మానవులుండు స్థితితో సంతృప్తి జెంది నేను దలంచురీతిని వారు మెలంగక పోయినను వారిని మానవులుగనే చూడవలె నని తలంచినచో నిజమగు మహమ్మదీయునివలె నేనును సర్వవస్తువులున్న స్థితికి సంతృప్తి జెంది అదియే భగవంతునియిచ్ఛ యని చెప్పవలయును. దీనికి పశుశక్తి కించుక భేదము గలదు. దీని నెదుర్కొనిన కొంత ఫలితము గల్గును. కాని గానవిశారదు డగు ఆర్ఫ్యూస్ వలె

పర్వతములను, చెట్లను, మృగములను నెదుర్కొని వాని సహజస్వభావము మార్పుదల జేయ సాహసించను.

ఏ మానవునితో గాని దేశముతో గాని కయ్యము పెట్టుకొనవలెనని నాయభిలాష గాదు. వస్తువులందతిసూక్ష్మమగు లక్షణభేధములు గలవని చూపి కాలయాపనచేయుటకు గాని నా సమీపస్థులకంటె నే నెక్కువ తెలివి గలవాడనని చెప్పుట కాని నా కోర్కె గాదు. దేశములోని శాసనముల కనుగుణ్యముగ ప్రవర్తించుట కొక మిషకై నే నెప్పుడును వెదకుచుందును. నే నట్టివానికి బద్ధుడనై యున్నాను. కాని యీ విషయమున నన్ను గూర్చి నాకే యనుమానము గల్గుచుండును. ప్రతి సంవత్సరము పన్నులు వసూలు చేయువాడు నా దగ్గరకు వచ్చినపుడు ప్రభుత్వము వారి చర్యలను, జనుల యుద్దేశములను బరీక్షించుచు యేదియో యొక మిషచే నీశాసనము నతిక్రమించుచుందును.

ఇట్టిపని యింకముందు జరుగకుండ ప్రభుత్వము వారు చేయగలుగుదురని నమ్ముచున్నాను. స్థూలబుద్ధితో మన ప్రభుత్వమును గమనించిన నెన్నిలోపము లున్నను మంచిదనియే తోచును. శాసనములును న్యాయస్థానములును గౌరవింపదగినవిగను, అనేకమంది యిదివరకే అమెరికను ప్రభుత్వమును పొగడినపొగడ్తలు ప్రశంసాపాత్రము లయినవనియు దోచును. కాని సూక్ష్మదృష్టితో నవలోకించిన నే నిదివరకు చెప్పిన రీతిని గన్పించును. అంతకంటె సత్యోత్తమమగు పథమునుండి వీక్షించిన నది (ప్రభుత్వము) చూడదగిన దనియు దానివిషయ మాలోచింపదగిన దనియు నెవరు చెప్పగలరు ?

ఎట్లున్నను ప్రభుత్వముతో నా కెట్టి సంబంధమును లేదు. అందుచే దానినిగూర్చి నేను విశేషముగ నాలోచింపను. ఈ ప్రపంచములో నేప్రభుత్వము క్రిందను నే నెన్నో నాళ్లు జీవింపను. అసలెప్పుడును ప్రపంచమందుండని దానిని ఉన్నట్లుగా మనోవాక్కాయకర్మలందు స్వేచ్ఛ ననుభవించు మానవుడు భావింపకున్నచో దూరాలోచన లేని ప్రభువులుగాని సంస్కర్తలుగాని అతనికి విఘ్నములు గలిగింపజాలరు.

ఇతరులనేకులు నాతో నేకీభవింపరని నాకు దెలియును. కాని యీ విషయమును గాని తదితరయుక్తవిషయములను గాని చర్చించుటయందు తమ జీవితము ధారవోసిన వారు నన్ను సంతృప్తిపరచలేరు.

ఒక సంఘమునకు కృషి సలుపుచున్న రాజకీయవేత్తలెవరును దాని నిజస్వరూపమును సంపూర్ణముగ గ్రహించి యుండలేదు. సంఘకదలికనుగూర్చి మాటాడెదరు. కాని అది లేకున్న విశ్రమస్థానము వారికి లేదు. వారిజ్ఞానసంపత్తిచే కొంత యనుభవమును, కొన్ని పద్ధతులను గనిపెట్టియుండవచ్చును. అందులకు వారు వందనీయులు. వారిజ్ఞానోపయోగమును వారిహృదయనిర్మలత్వమును కొన్నిహద్దులమధ్య నిమిడియున్నవి. ప్రపంచమందు తాత్కాలికజ్ఞానము నిష్ప్రయోజనమనువిషయము వారికి తెలియదు. పాశ్చాత్యప్రభుత్వము యొక్క యంతర్భాగముల గ్రహింపజాలరు. అందుచే దానిని గురించి సరిగా మాటలాడలేదు. ప్రస్తుతప్రభుత్వనిర్మాణమున ముఖ్యమగు సంస్కారణములను చేయదలంచుకొనిన శాసనకర్తల కాతనిమాట లర్థరహితములుగ గన్పట్టును.

కాని ఆలోచనాపరులకును శాశ్వతస్థాపనకునై శాసనముల గావించువారికిని ఆతడు తనముఖ్యవిషయమును క్రీగంటనైన చూచియుండునట్లు దోచును. నేనెఱింగిన కొందరియూహాల తో పోల్చిన నాతనిహృదయము విశాలమైనదనియే యని తెలియును. ఉద్యోగములలో మునిగి తేలు సంస్కర్తలయొక్కయు రాజకీయవేత్తలయొక్కయు తెలివివాగ్ధోరణులతో పోల్చిన నాతనిపలుకులు జ్ఞానయుక్తము లనియు, విలువగల వనియు దోచును. అందునకు దేవున కెంతయు కృతజ్ఞులము. భగవంతు డందరికంటె నెక్కువశక్తివంతుడు. కల్పనాశక్తి గలవాడు. అనుభవైకవేద్యుడు న్యాయవాదియొక్క సత్య మెన్నటికిని సత్య మనబడదు. అది అనుగుణ్యత యనంబడు. కానున్న తాత్కాలికమగు ననుగుణ్యత యగును. సత్య మెప్పుడును దేవునియందే లీనమగును. కాన చెడ్డపనులచేయుట యందు గల న్యాయాన్యాయముల వెలిబుచ్చుటతో నాకు నిమిత్తము లేదు. అట్టివారిని ప్రభుత్వము సమర్థించువారని చెప్పుట మంచిది. సమర్థించక నతడు చేయున దేమియు లేదు. ఆత డొకనియమను చరుడు కాడు. "ఆరంభమున రాష్ట్రీయ ప్రభుత్వములన్నియు చేరి యెట్టి పద్ధతులపై కూడెనో అట్టి పద్ధతులతో మార్పుదల చేయుటకు నేను యత్నించియుండ లేదు. ఇక ముందును ప్రయత్నింపను. ఏ ప్రయత్నము నిది వఱకు జెదురొక్కనలేదు. ఇకముం దెదురొక్కన జూడ నని" యాతడనును. బానిసవర్తకసందర్భమున ప్రభుత్వమున కున్న యధికారమును చూచి మొట్టమొదటిభాగములో నదియొక భాగము కావున దాని నట్లుండనిండని చెప్పెను. ఆతని కెట్టి ప్రత్యేకసామర్థ్య మున్నను, ఒక విషయమున కున్న రాజ

కీయ బాంధవ్యమును దొలగింపజాలక బుద్ధిచాకచక్యతచే దాని నిర్ణయింపలేకున్నాడు. ప్రస్తుత మమెరికా దేశమున శాసనవర్తకము విషయమై చూపవలసిన బుద్ధిచాకచక్యతయే, తన స్వకీయాభిప్రాయమునే వెలిబుచ్చుచున్నానని చెప్పుచు నీక్రింది జవాబొసంగుచున్నాడు. దీనివలన నెట్టి నూతనసాంఘికధర్మము లవలంబింపబడినవో యూహింపుడు. అత డిట్లు చెప్పెను— "శాసనవర్తకము వ్యాపించియున్న రాష్ట్రములలో ప్రభుత్వమువారు తమకుతామే యోచించుకొని, యందలి యంతర్భాగములగు సంఘములకును మానుషత్వము, న్యాయము, దైవములకును సమాధానముగను పరిపాలనము నడుపుకొనవలెను. వేఱొకచోట మానవులందు పరస్పరభావములవలన జన్మించిన సంబంధములకు దానితో నేమియు పనిలేదు. అట్టివాని నే నిదివరకెన్నడును ప్రోత్సహించి యుండలేదు. ఇంకముందు ప్రోత్సహింపను.

సత్యమునకు గల శుభ్రతరమగు జన్మస్థానము నెఱుంగనివారు దానియొక్క అంతును కనిపెట్టజాలక వారున్నచోటనే నిలుచుండి మతమునకును ప్రభుత్వమునకును విధేయులై, మర్యాదతోను నమ్రతతోను ప్రవర్తించుచుందురు. అక్కడక్కడ స్వల్పమాత్రపు సూచనలు గాంచువారు మరొకసారి నడుములు బిగించి, దానియంతును గనుగొనుటకై యాత్రను కొనసాగించెదరు.

ఈ అమెరికాలో శాసనములను నిర్మించుటయందు తెలివిగలవా డెవ్వడు నింతవరకు రాలేదు. ప్రపంచచరిత్రమునందే యట్టివా రరుదు. వక్తలును రాజకీయవేత్తలును వేనకువేలు గలరు. విశేషముగ తర్కింపబడుచున్న

సమస్యలను పరిష్కరించు సామర్థ్యము గల వక్త యింకను మాట్లాడుటకు నోరు తెరవలేదు. దేశమునకు స్వాతంత్ర్య వాణిజ్యమువలనను, స్వేచ్ఛవలనను, సంఘీభావమువలనను, న్యాయపరిష్కారము వలన గల్గు లాభములను మన శాసన కర్తలు గుర్తెఱుంగరు. పన్నులను విధించుట, ఆర్థిక శాస్త్రము వర్తకము, వస్తు నిర్మాణము, వ్యవసాయము మొదలగు నల్ప సమస్యలను పరిష్కరించుటకును తగు శక్తి వారికి లేదు. మనలను నడుపుటకై జనులయొక్క యనుభవము చేతను, వారి విన్నపముల చేతను మార్పుదల చెందని శాసన కర్తయొక్క వాక్చాతుర్యముపైననే మనము శాసనసభయందాధారపడి యుండినయెడల ప్రపంచమందలి దేశములలో ప్రస్తుత మమెరికావా రాక్రమించుకొనియున్న స్థానము చాలకాలము ముండజాలదు. నూతన సువార్త వ్రాయబడి 1800 సంవత్సరములైనవి. కాని శాసననిర్మాణ శాస్త్రమునందభినివేశము గలిగి దాని ననుకరణముం దుంచిన శాసనకర్త యేడీ ?

నాకంటె విశేషముల నెఱింగి యుత్తమమార్గమున నడచువారికిని, అనేక విషయములలో నంత బాగుగ ప్రవేశము లేనివారికిని నేను విధేయుడనై యుందును. ప్రభుత్వము యొక్క యధికారము నేను శిరసా వహించునంతవరకైనను అది నిర్మలత్వముతో గూడినదిగాదు. అది న్యాయముగ నుండవలె నన్న పాలితులయొక్క యనుమతిప్రకారము నడువవలయును. దానికి నేను మనఃపూర్వకముగ నిచ్చినదానిపైన తప్ప నాపైనను నా యాస్తిపైనను దానికే యధికారమును లేదు. నిరంకుశ ప్రభుత్వమునుండి మితి గల యధికారము

చెలాయించు ప్రభుత్వమునకును, అట్టి ప్రభుత్వమునుండి ప్రజాస్వామిక ప్రభుత్వమునకును మారుటచే వ్యక్తిజీవితమున కెంత గౌరవ మొసంగగలదో కనిపెట్టవచ్చును. వ్యక్తియే సామ్రాజ్యమునకు బునాదియని చీనాదేశపు వేదాంతి చెప్పియున్నాడు. మనము గ్రహించిన ప్రజాస్వామికరాజ్యమేనా ప్రభుత్వముయొక్క కట్టకడపటి యవతారము? మానవుని హక్కుల నిర్ణయించి యికముం దడుగు వేయుటకు వీలు లేదా? ప్రభుత్వమునకు గల్గు యధికారము వ్యక్తులద్వారా సంప్రాప్తించును అట్లైతటే దాని నెఱింగి వ్యక్తిస్వాతంత్ర్య మభిలషించు నొక యున్నతమైన మహాశక్తిగ పరిగణింప వలయును. వేర్వేరువ్యక్తుల నట్లు గమనించి ప్రవర్తించుచో ప్రభుత్వము కూడ జ్ఞానవంతమై స్వేచ్ఛాభావములతో దనరారుచుండునట్లు గోచరమగును. తగినరీతిని వాటిని సన్మానించిననేగాని ప్రభుత్వము తన ధర్మమును నెరవేర్చినది కాజాలదు. అందరకును న్యాయము గావించుచు, నాయావ్యక్తుల నిరుగుపొరుగువారివలె మర్యాదతో జూచుచు, తమ తమ ధర్మముల నిర్వర్తించుకొనుచు దానిజోలికి పోక, దానిచే తాకబడక దూరదూరముగ నుండువారు కొందరుండినను తన భావములకు భిన్నముగ నుండువారని యెంచనటువంటి ప్రభుత్వము నొకదాని నూహించుటతో గుతూహాలుడనగుచున్నాను. ఇట్టిఫలముల నిచ్చు ప్రభుత్వము వాటిని పండగనే రాలిపోనిచ్చిననే నిదివఱకెన్నడు చూడకపోయినను నామదిలో నున్నట్టియు తనకంటె నున్నతమగు ప్రభుత్వమునకు మార్గము సిద్ధపరచిన దగును.